# బసివిరాలు బరితెగించింది

కథ



డా.ఎం.హరి కిషన్

# బసివిరాలు బరితెగించింది

జనం గుంపులుగుంపులుగా చేనుగట్టు చుట్టూ నిలబన్నారు. అందరి మొగాల్లోనూ ఏదో ఆత్రుత, ఆందోళన... ఒకటే గుసగుసలు దాదాపు నలభై ఎకరాల చేను. ఎవరూ లోపలికి దిగడం లేదు. ఎవరో మంత్రగాడు మంత్రాలు చదువుతూ చేనంతా మంత్రించిన నీళ్ళు చల్లుతా వున్నాడు. నుదుటిపై ఎర్రని పెద్ద బొట్టుతో, లావు మీసాలతో విరబోసుకున్న జుట్టుతో, ఒంటిపై లావులావు రుద్రాక్షలతో, కాషాయపు అడ్డపంచతో చూడ్డానికి భయంకరంగా వున్నాడు. ఆరేడుమంది రైతులు గడాలతో చేను దున్నడానికి సిద్ధంగా వున్నారు. మంత్రగాడు ఏవేవో మంత్రాలు గట్టిగా చదువుతూ నిమ్మకాయలు కోసి పొలం నాలుగు వైపులా విసిరి మొదలుపెట్టమన్నట్లుగా సైగ చేసినాడు. అంతే.. అక్కడ ఒక్కసారిగా నిశబ్దం ఆవరించింది. గాలి పీలుస్తూ వదుల్తున్న చప్పుళ్ళు తప్ప ఏమీ వినబడ్డం లేదు. అందరి కళ్ళూ దున్నుతున్న గడాల వెంటే పరుగెడుతూ గుచ్చి గుచ్చి చూస్తున్నాయి.

"బాగా లోతుగా జాగ్రత్తగా దున్నండి, అంగుళం కూడా వదలగూడదు" అంటున్నాడు మంత్రగాడు. నెమ్మదిగా నిమిషాలు గంటలుగా మారుతున్నాయి. జనాలు మాత్రం కట్టుకదలడం లేదు.

వూర్లో నుంచి గుంపులుగుంపులుగా వస్తున్న జనాలు వారికి తోడై పెదింతమంది పెరుగుతున్నారు. రెండుగంటలు దాటింది. పొలంలో మూడు భాగాలు దున్నడం పూర్తయింది. అంతలో బైటినుంచి ఒకరు "రేయ్.. .మాదేవగాని గడానికి ఏదో ఎర్రగా తగులుకోనింది సూడు" అంటూ గట్టిగా అరిచినాడు. అంతే.. జనాలంతా వులిక్కిపన్నారు. అందరి కళ్ళూ ఒక్కసారిగా అటువైపుకు తిరిగినాయి. మాదేవ దున్నడమాపేసి భయంభయంగా వణుకుతూ సర్రున పక్కకి జరిగినాడు.

మంత్రగాడు అక్కడికి పోయినాడు. ఎర్రగా ఏదో బట్ట. దాని చుట్టూ నెమ్మదిగా మట్టి గెలికినారు. ఎర్రని సంచీ లోపల ఏదో లావుగా... దాని చుట్టూ పసుపూ, కుంకుమ, నిమ్మకాయలు. "రేయ్... మనం గాని తీస్తే రక్తం కక్కుకొని అక్కడికక్కడే సచ్చి శవాలవుతాం. పెట్టినోళ్ళే తీయాలి. జాగ్రత్త" అంటూ గట్టిగా అరిచినాడు ఒక ముసిలోడు. మంత్రగాడు కూడా అదే మంచిదంటూ వెనక్కి తిరిగినాడు. కొందరిని ఆన్నే కాపలా వుంచి మిగిలిన వారంతా పెదరెడ్డి ఇంటివైపు బైలుదేరినారు.

* * * * * *

ఉలిగమ్మ పెదరెడ్డి ఇంటి ముందు ఒక మూలకు లేచే సత్తువ లేక అట్లాగే నేలకు కరుచుకొని పడి వుంది. ఆమె ఒళ్ళంతా దెబ్బలతో కందిపోయి మొగం వాచిపోయి వుంది. జుట్టు ముడి వీడి వెంట్రుకలు చెల్లాచెదురుగా పడివున్నాయి. ఏడ్చి ఏడ్చి కళ్ళు లోపలికి పీక్కుపోయినాయి. బట్టలంతా నలిగి మట్టికొట్టుకుపోయినాయి. దూరంగా కూచున్న పెదరెడ్డి మనుషులు బారాకట్టా ఆడతా ఆమెను మధ్యమధ్యలో జాగ్రత్తగా గమనిస్తా వున్నారు. అంతలో అక్కడంతా కోలాహలం. అంతవరకూ నిశబ్దంగా వున్న ఆ ప్రదేశమంతా జనాల అరుపులు, కేకలతో నిండిపోయింది.

ఆ చప్పుళ్ళకు పెదరెడ్డి బైటకు వచ్చినాడు. నుదుటన

విబూది అడ్డంబొట్లతో, పెదవులపై చిరునవ్వుతో ప్రశాంతంగా కనిపిస్తున్నాడు. ఆ చప్పుడుకి ఉలిగమ్మ పడుకునే రెడ్డివంక సూటిగా చూసింది. ఆమె కళ్ళ నిండా అసహ్యం, కసి. రెడ్డి ఆమె వంక కొరకొరకొర చూస్తా జనాలవైపు కదలినాడు. అంతలో వాళ్ళను తోసుకుంటా మంత్రగాడు ముందుకొచ్చి విషయమంతా వివరించినాడు. పిల్లలూ, పెద్దలూ, ముసలీ ముతకా, ఆడామగా గుంపులుగుంపులుగా రెడ్డింటిముందు గుమిగూడతా వున్నారు. వూరువూరంతా కోపంతో వూగిపోతా వుంది. "దీన్ని ఇట్లాగే వదిలేస్తే లాభం లేదు. కొట్టంలో యేసి కాల్చి పాడేయండి, వూరికి పట్టిన శని వదిలిపోతాది" ఎవడో తాగి గట్టిగా అరుస్తా వున్నాడు.

"రెడ్డీ... దాన్ని తోలుకపోయి ముందర ఆ సంచీ తీపిస్తాం. తరువాత ఏం సేయాలో సూద్దాం" అన్నాడు మంత్రగాడు. రెడ్డి అలాగేనంటూ తలూపినాడు. వెంటనే పెదరెడ్డి అనుచరుడు ఆమె జుట్టు పట్టుకొని 'లెయ్.. గబ్బుదానా.. లెయ్' అంటూ పైకి లేపి బలంగా ముందుకు దొబ్బినాడు. ఆమె తూలి ముందుకు పడింది. నెమ్మదిగా లేచి, నేలకు పొరాడుతున్న కొంగును సరిచేసుకుంటుండగానే ఇంగొగడు ఈడ్సి ఆమె చెంప మీద పెరికినాడు. ఎవడు పడితే వాడు దారెంబడి తన్నుకుంటూ, దొబ్బుకుంటూ తీసుకుపోసాగినారు. దారికిరువైపులా ఇండ్లముందు, మిద్దెలమీదా నిలబన్న ఆడోళ్ళు, ముసిలోళ్ళు శాపనార్థాలు పెడుతున్నారు.

"ఏం పోయేకాలమొచ్చిందో దీనికి... వూళ్ళో నచ్చనోళ్ళందరిమీదా సేతబడి సేపిస్తోంది.... "

"దొంగసచ్చినేది. దేవుని దగ్గర పూజలు సేసుకుంటా పడివుండాల్సినేది శానా తెలివిమీరిపోయింది. దుడ్లు రెండుసేతులా ఆడ్డం మొదలుకాగానే మదమెక్కింది దీనికి..."

జనాలంతా తలావొక మాట అంటున్నారు.

ఉలిగమ్మ శక్తినంతా కూడగట్టుకుంటూ అడుగులో అడుగు వేస్తా వుంది. పది అడుగులకోసారి కిందబడిపోతా వుంది.

అది చూసిన ఒక ముసిలోనికి మనసులో యాడో కరిగింది.

"రేయ్... అది దావలోనే సచ్చేట్టుంది. బెరీత దాన్ని ఎద్దులబడిలోకి ఎక్కియ్యండి. మళ్ళా అది సస్తే సేనులో తీసేదెవరు" అంటూ గట్టిగా అరిచినాడు. అప్పటికే ఉలిగమ్మ నేలను కరచుకోనింది. నిన్నటి నుంచీ తిండి లేదు. నోట్లోంచి జొల్లు కారుతోంది. 'ముసిలోడు చెప్పింది నిజమే.. ఇది మధ్యలోనే సచ్చేట్టుంది.' అన్నాడు ఇంగోడు. వెంటనే ఎద్దులబండిని తెప్పించి, ఎత్తి పైన పడేసినారు. ముసిలోడు నీళ్ళు తెచ్చి ఉలిగమ్మ నోటికి అందించినాడు. ఉలిగమ్మ బెరబెరా తాగబోయింది. పొలమారి దగ్గొచ్చి కిందామీదా అయింది. ముసిలోడు ఆమె నెత్తి మీద తడుతూ తల ఎత్తిపట్టి నెమ్మదిగా నీళ్ళు తాపినాడు. ఆమెకి కొంచెం సత్తువ వచ్చినట్లయ్యింది. ఎద్దులబండి ముందుకి కదిలింది.

అదట్లా పోతా మాదిగ్గేరిలోకి వచ్చింది. ఒకప్పుడు ఇదే వీధుల గుండా తను వొద్దువొద్దంటూ మొత్తుకుంటున్నా... ఏడుస్తున్నా ... వూరువూరంతా సంబరాలు సేసుకుంటూ ఉలిగవ్వగుడి వరకు వూరేగించింది గుర్తుకు వచ్చింది. నెమ్మదిగా కళ్ళు పైకెత్తి చూసింది. దూరంగా తనిల్లు. కొత్తగా పైన వేసిన రెండుగదులతో గేరికంతా అందంగా వుంది. దాన్ని సూస్తుంటే ఆమెకు కోటయ్య గుర్తుకు వచ్చినాడు. చిన్నప్పటి నుంచీ పడిన పాట్లన్నీ ఒక్కొక్కటే గుర్తుకు రాసాగినాయి. జనాల ఎత్తిపొడుపులు, తిట్లు, అవహేళనల మధ్య ఎద్దులబండి సాగిపోతా వుంది. ఆమె కళ్ళు మూసుకునింది.

* * * * * *

"సూడు... నాకు పెండ్లాం లేదు. పిల్లలూ లేరు. మళ్ళా మనువు సేసుకోవాలన్నా వయసయిపోతా వుంది. నాతో వుండు. నెత్తిన బెట్టుకొని వూరేగించలేకున్నా కడుపునిండా నాలుగు ముద్దలు పెడతా. నా ఇండ్లూ, పొలమూ సూసుకుంటా వుందువుగానీ" అన్నాడు కోటయ్య.

కోటయ్యకు వయసు యాభై దగ్గర పడింది. ఆరెకరాల మెట్టపొలం, ఒక చిన్న ఇల్లు వున్నాయి. మనిషి మంచోడే. గేరిలో ఎవరితోనూ పెద్దగా మాట్లాడడు. తన పనేందో తాను చూసుకుంటా వుంటాడు. దాంతో ఉలిగమ్మ ఆలోచనలో పడింది. అంతలో ఆమెకు ఒక సంగతి గుర్తుకొచ్చి..." కానీ... నీవు మతం మారినావు గదా... ఎట్లా" అనింది.

కోటయ్య నవ్వి "నేనేంది... మనూర్లో తొంభైశాతం మంది మారినారు. అట్లా మారినందుకే గదా ఇప్పుడు వాళ్ళు తమ పిల్లలెవరినీ బసివినిలుగా దేవుళ్ళకు వదలడం లేదు. ఐనా నువ్విప్పుడు రోడ్డుమీద పన్నావుగదా... ఎవరైనా మీ మతమోళ్ళు అయ్యో అని జాలి సూపిస్తున్నారా... దారి సూపిస్తున్నారా... ఐనా మతం మారి ఈడ వుద్దరిస్తున్నది గూడా ఏమీ లేదులే. యాడైనా మాదిగోడు మాదిగోడే. నీ ఇష్టమొచ్చినట్లుండు. నాకేం పట్టింపులేదు" అన్నాడు.

ఉలిగమ్మ అప్పటికప్పుడు ఏమీ చెప్పలేక మళ్ళా చెబుతానని పంపించేసింది. ఇంట్లో ఒక్కతే కూచుంది. పడిపోడానికి సిద్ధంగా వున్న పాత ఇండ్లు. ఎప్పుడో నాయనలకాలం నాటిది. మొన్నమొన్నటి వరకూ పరమేశ్వరరెడ్డి వచ్చిపోతోండె. మొదటి పది సమ్మచ్చరాలు బాగానే జరిగింది. కానీ తర్వాత రావడం తక్కువైంది. వారానికోసారి వచ్చేవాడు కాస్తా నెలకో, రెన్నెళ్ళకో రాసాగినాడు. ఆరోజు... ఆమెకింకా పచ్చిగానే గుర్తుంది. పరమేశ్వరరెడ్డి ఇంటికి రాగానే ఏమీ మాట్లాడకుండా మంచమ్మీద కూచున్నాడు. మొగం చానా గంభీరంగా వుంది. ఉలిగమ్మ బెరబెరా వచ్చి రెడ్డి కాళ్ళకాడ కూచోనింది. రెడ్డి ఏమీ మాట్లాల్లేదు.

చానాసేపు అట్లాగే సప్పుడు లేకుండా వుండిపోయినాడు. ఉలిగమ్మే కాసేపు సూసి "ఏం రొడ్డీ అట్లున్నావు" అనింది. పరమేశ్వరరెడ్డి కాసేపు గుమ్మం వంక చూసి...

"సూడు ... ఈ రోజే ఆఖరు. ఇంగ రాను. ఇప్పటికే ఇట్లా మాదిగ్గేరికి నీకోసరం వస్తా వుంటే అందరూ నానాక మాటలంటూ, సాటుగా నవ్వుకుంటున్నారు. ఒగప్పుడు మా కులమోళ్ళకు వుంచుకోవడం గొప్పగానే వుండింది గానీ ఇప్పుడు శానా సిన్నతనంగా సూస్తున్నారు. ఇంగ రాలేను. ఇంట్లో గూడా శానా గొడవలవుతున్నాయి. ఇగో ఈ పదేలు తీసుకో.." అంటూ డబ్బు అక్కడపెట్టి మరోమాటకు తావు లేకుండా లేసిపోయినాడు.

ఆ మాటినగానే ఉలిగమ్మ గుండెల్లో రాయిపడింది. రెడ్డి పోయినవైపే అట్లాగే చూస్తుండిపోయింది. కళ్ళలోంచి ఒక్కసారిగా నీళ్ళు దుంకినాయి. ఇట్లాంటి రోజొకటి ఎప్పుడో ఒకప్పుడు వస్తాదని ముందే తెలుసు. ఎవరి జీవితమూ ఒకరితోనే సాగిపోవడం లేదు. సోకున్నంత వరకో, మోజు తగ్గేంతవరకో... చిత్తకార్తె కుక్కల్లా ఎదురుచూస్తుంటారు కొందరు. మొదటోడు ఎప్పుడిడుస్తాడా అని... ఆళ్ళ సేతిలో పడితే అంతే... రెండుమూడు సమ్మచ్చరాలకే మళ్ళా మొదటికొస్తాది. కోటయ్యగూడా అట్లాంటోడేనా... తలచుకుంటే ఒగటే భయం. ఉలిగమ్మకు వాళ్ళ నాయన గుర్తుకు వచ్చినాడు ఒళ్ళు అసహ్యంతో వణికింది.

అప్పటికి ఉలిగమ్మకు పదమూడేళ్ళు. వాళ్ళ వూరు కర్నాటక సరిహద్దుల్లో వుండడంతో కన్నడ మీడియం, తెలుగుమీడియం బళ్ళు రెండూ వుండేవి. బాగా డబ్బున్నోళ్ళు, పెద్ద కులమోళ్ళు, తురకోళ్ళు ఎక్కువగా కన్నడమీడియం చదువుతా వుంటే... మాలమాదిగలు, బీసీకులాల్లో చితికినవాళ్ళు తెలుగుమీడియం చదివేటోళ్ళు. వులిగమ్మే బడికి పోతానంటే వాళ్ళ నాన్న "ఎందుకే మనకు సదువు. కూలీ

సేసుకుంటే నాలుగు డబ్బులొస్తాయి” అంటూ అడ్డు చెప్పినాడు గానీ ఉలిగమ్మ పట్టు వదల్లా. ఎన్ని తన్నినా బడికే పోతానని మొండికేసింది. అది చూసి తల్లి “ సదువుకుంటానని అది అంత బంగపోతోందిగదా... వదిలెయ్... ఆ కసుగాయ పనిసేసినా సేయకపోయినా ఈడ ఒరిగేదీ లేదు. తరిగేదీ లేదు” అంటూ వెనకేసుకు వచ్చేది. “ తల్లీబిడ్డలిద్దరూ ఒగట్టైనాక ఏం సేస్తాం. అదేదో పెద్ద సదివి వుద్దరించేటట్లు... కర్మ... కర్మ... ” అంటూ గొణుక్కునేవాడు. అట్లా ఏడుదాకా వచ్చింది. అక్కడ తెలుగుమీడియం వుండేది ఏడు వరకే. హైస్కూలు పక్కూరిలో వుంది. దాంతో అంతదూరం పోలేక తల్లితో పాటు కూలీకి పోసాగింది. ఎప్పుడూ గలగలా మాట్లాడుతా, బాగా పాటలు పాడేది, కతలు చెప్పేది.

శివయ్యకు ఇద్దరూ ఆడకూతుర్లే. మొగపిల్లోని కోసరం చానా రోజులు ఎదురు చూసినాడు గానీ ఒకడు పుట్టి పురిట్లోనే చచ్చిపోయినాడు. అది చూసి డాక్టరు ఇట్లాగే మళ్ళా కాన్పుకి వస్తే బిడ్డ పుట్టే సంగతేమో కానీ తల్లి పోయేది మాత్రం ఖాయం అని చిలక్కి చెప్పినట్టు చెప్పినాడు. కానీ శివయ్య పట్టించుకోలేదు. దాంతో ఈసారి కాన్పులో బిడ్డ అడ్డం తిరిగి ఆసుపత్రికి చేరుకోకముందే తల్లీబిడ్డలిద్దరూ దారిలోనే చచ్చిపోయినారు. అప్పటికే పెద్దపిల్లకు వయసొచ్చింది. ఆ పిల్ల పెండ్లికి వున్నదంతా ఖర్చు పెట్టినా పదేలు అప్పయ్యింది. దాన్ని తీర్చలేక కిందామీదా పడతా వున్నాడు. సారాయి తాగడం ఎక్కువైంది. ఒకరోజు రాత్రి బాగా తాగి వస్తా వస్తా చీకటిలో చూసుకోక ఎద్దులబండి కింద పన్నాడు. బండి చక్రం ఎక్కడంతో ఎడంకాలు విరిగిపోయింది. దాంతో ఇంటి బాధ్యతంతా ఉలిగమ్మ మీదే పడింది. కూలి పనులకి పోతా నాయనను చూసుకోసాగింది. అట్లా కొంతకాలం జరిగేసరికి ఉలిగమ్మ గూడా ఎదకొచ్చింది. శివయ్యకు ఏం చేయాల్నో అర్థం కాలేదు. కూతురు పెండ్లి సేసుకోని ఎళ్ళిపోతే తన బదుకెట్లా అని కిందామీదా పడసాగినాడు.

అప్పుడు సుట్టుపక్కల జనాలు "సూడు ఎందుకట్లా దిగాలు పడుతున్నావు. నీ పిల్లను దేవునికిడ్సు. ముసలితనాన నిన్ను సూసుకుంటూ నీ కళ్ళముందే వుంటాది. మొన్నే నాలుగునెళ్ళ కిందట ఆలూరులో మా పెద్దమామ ఆళ్ళ కూతురికి సిన్నప్పటి నుంచే పోలియో వచ్చి కాలొంకరయింది. ఎవరూ పెండ్లి సేసుకోడానికి ముందుకు రాలే. దాంతో దేవునికి వదిలినాడు. పోయినేడాది కౌతాళంలో మాకు దూరపు బంధువు. నీ మాదిరే మొగపిల్లలు లేరు. దాంతో దేవునికిడ్సి తన దగ్గర్నే పెట్టుకున్నాడు, ముసలితనాన పోషిస్తాదని. నీవేమన్నా లచ్చాదికారివా... ఇప్పటికే అప్పులు నెత్తికెక్కినాయి. దాంతోపాటు కాలొంకర. నీ బిడ్డకి పెండ్లి సేసినావంటే అడుక్కోని బతకాల్సిందే. ఆలోసించుకో" అన్నారు. ఆ మాటల్తో శివయ్య గూడా తన కూతుర్ని బసివిరాల్ని సెయ్యాలని నిర్ణయించుకొన్నాడు. దాంతో వూరి పెద్దలు పరమేశ్వరరెడ్డిని వుంచుకోడానికి ఒప్పించి, తలా యింత యేసి దేవర సేయాలని నిర్ణయించుకొన్నారు. విషయం తెలిసి ఉలిగమ్మ "వద్దు నాయనా... నాకు పెండ్లీ వద్దు... ఏమీ వద్దు... నీతోనే వుంటూ సచ్చేంత వరకూ నిన్నే సూసుకుంటా. నా మాట నమ్ము" అంటూ కాళ్ళావేళ్ళా పడింది గానీ.. "లే.. వూరోళ్ళకి మాటిస్తి. ఒగసారి ఒప్పుకున్నాక తప్పదు. ఆచారం ఆచారమే.. నీవే గనుక నా మాటినకుంటే బాయిలో దూకి సస్తా" అంటూ బెదిరిచ్చి ఒప్పిచ్చినాడు. తల్లే గనుక వుంటే తన బదుకిట్లా అయ్యేది గాదని కుమిలి కుమిలి ఏడ్చింది. బసివినిగా మారినా బసివినులతో కలిసేది కాదు. పూజలు చేసేది కాదు. పరమేశ్వరరెడ్డి వారానికోపారి వచ్చి పోయేటోడు. అట్లా నెమ్మదిగా ఆ బదుకు అలవాటయిపోయింది. సమ్మచ్చరం తిరిగేసరికి ఒక కొడుకు పుట్నాడు. వాడి ఆలనాపాలనలో మునిగిపోయింది. అట్లా పది సమ్మచ్చరాలు గడిచిపోయినాయి. పిల్లోడు ఐదో తరగతికి వచ్చినాడు. పోయిన సమ్మచ్చరమే తండ్రి గూడా చచ్చిపోయినాడు. అక్క ఎక్కన్నో దూరంగా

వుంది. రాకపోకలు అస్సలు లేవు. దాంతో దాదాపు అనాథగా మారిపోయింది. పరమేశ్వరరెడ్డి వదిలేసినాక మరో బోయాయన వుంచుకున్నాడు గానీ అది ఆర్నెల్లే. దాంతో ఉలిగమ్మ ఇంగ ఎవరికీ పైట పరచగూడదని నిచ్చయం చేసుకొని పొలంపనికి పోవడం మొదలుపెట్టింది. కొడుకును గూడా అందరూ ఎగతాళి చేస్తుంటే, సూల్లేక తీసుకపోయి దూరంగా రెసిడెన్షియల్ పాఠశాల్లో చేర్పించింది. ఒక్కతే తినో తినకో బతుకీడుస్తా వుంటే మళ్ళా కోటయ్య వచ్చినాడు. ఉలిగమ్మకు ఏం చెప్పాల్నో అర్థం కావడం లేదు. ఆలోచనల్లోనే నిద్రపోయింది. అట్లా వారం రోజులు గడిచిపోయింది.

ఒకరోజు సాయంకాలం పొలంపనికి పోయొచ్చి కుండ పొయ్యి మీద పెడతా వుంటే మళ్ళీ వచ్చినాడు కోటయ్య.

“సూడు... నాకెవర్నీ నమ్మబుద్ధి గావడంల్యా. ఎల్లమ్మను, గాలమ్మను, తాయమ్మను, సుశీలమ్మను... అందర్నీ సూస్తానే వున్నా గదా... చివర్లో ఎవడూ నిలబడడు. ఎప్పటికైనా ఒంటిబదుకే... నేనిట్లాగే వుండాలనుకుంటున్నా” అనింది ఉలిగమ్మ.

కోటయ్య వాకిలినానుకొని నిలబడి “ సూడు ... నేనేం వయసులో వుండి తనకలాడుతా రాలే నీకాడికి. నువ్వంటే రొంత ఇష్టం. రొంత జాలి. ఎందుకంటావా... నీకు తెలీందేముంది.. మా ముత్తవ్వ, అవ్వ, అమ్మ అంతా బసివినులే తరతరాల ఆచారమంటూ ఒక్కొక్కర్నీ దించుతా వచ్చినారు. కానీ నా కాడికి వచ్చేటప్పటికి ఆడపిల్లలు పుట్టలే. కానీ మగపిల్లోన్నయినా సిన్నప్పుడు ఎన్ని అవమానాలు... ఎన్ని అవహేళనలు.. వూర్లో తలెత్తి ఒక్కమాట మాట్లాడ్తే సాలు ‘మిండ్లకు పుట్టిన్నాకొడకా నువ్వా మాట్లాడేది’ అంటూ ప్రతొక్కడు నానాక బూతులు తిట్టేటోడు. ఆ మాటలకు తలాడపెట్టుకోవాల్నో అర్థమయ్యేది కాదు. చచ్చిపోవాలనిపించేది. ఒక్కన్ని కూచోని ఎన్నిసార్లు కుళ్ళికుళ్ళి ఏడ్చినానో... మాయమ్మతో ఎన్నిసార్లు కొట్లాడినానో బళ్ళో పేరు

రాయించుకోడానికి పోతే సారు "ఏందీ... ఎవరికి పుట్టినావో తెలీదా... ఈడ నాయన పేరు రాయాల్రా... పో... పోయి మీయమ్మను పేరు కనుక్కోని రాపో" అంటూ సూసిన సూపులు, నవ్విన నవ్వులు నాకింకా గుర్తే తరగతి గదిలో గూడా నోరెత్తితే సాలు అంతా అవే తిట్లు. దాంతో నాలుగులోనే బడి మానేసినా. మా అమ్మయినా సుఖపడిందా అంటే అదీలేదు. ముగ్గురికి కొంగు పరిచింది గానీ ముసలితనాన సూసిందెవరూ లేదు. ఆ బాధలోంచే నిన్ను నాతో వుండమంటున్నా. అంతేగాదు నీ కొడుక్కి నాయనగా నాపేరు రాపిస్తా... సరేనా' అన్నాడు. ఆ మాటల్తో ఉలిగమ్మ కళ్ళలోంచి నీళ్ళు ఒక్కసారిగా వుబికి వచ్చినాయి. అట్లా మొదలైంది వాళ్ళిద్దరి మధ్యా బంధం.

కోటయ్య ఆమెను బాగా చూసుకునేటోడు. ఉలిగమ్మ కూడా పొలంపనిలో చేదోడువాదోడుగా వుండసాగింది. ఆ సమయంలోనే వాళ్ళ ఊరిలో కొత్తగా పొదుపు సంఘాలు మొదలయినాయి. లెక్కలు రాసేందుకు సదువుకున్న ఆడోళ్ళ అవసరమొచ్చింది. కోటయ్య ఉలిగమ్మను బలవంతంగా అందులో చేర్పించినాడు. చిన్నప్పటి నుంచీ తెలివైంది కావడంతో ఆమెకు నెమ్మదిగా పొదుపు సంఘం వ్యవహారాలన్నీ బాగా వంటబట్టినాయి. నెమ్మదిగా గ్రూపులకు నాయకురాలిగా తయారైంది. కోటయ్య ప్రోత్సాహంతో పదోతరగతి ప్రయివేటుగా కట్టుకొని రెండు సమ్మచ్చరాల్లో ఒక్కొక్క సబ్జెక్టే గట్టెక్కుతా పాసయిపోయింది. పొదుపు లక్ష్మిలోంచి డబ్బు తీసుకొని మాంచి పాడిగేదెలను కొనింది. ఉలిగమ్మ మాటలు, పాటలు, తెగువ, బసివిని నుంచి ఎదగడం అధికారులను బాగా ఆకట్టుకొనింది. దాంతో ఆదోనికి, కర్నూలుకి పొదుపు సంఘాల సమావేశాలకు పోవడం, ఇతర జిల్లాలకు పోయి పొదుపు సంఘాల గురించి ఉపన్యాసాలు ఇవ్వడం, పెద్ద అధికారులతో పరిచయాలు, ధైర్యంగా మాట్లాడగలగడం... అట్లా చూస్తుండగానే ఉలిగమ్మ జీవితం మారిపోయింది. ఆమె కట్టూ, బొట్టూ,

మాటతీరు అన్నీ మారిపోయినాయి. గాసగాన్ని పెట్టి పాలయాపారం మొదలు పెట్టింది. పిల్లోన్ని టౌనులో మాంచి కాలేజీలో చేర్పించింది. తమ కళ్ళ ముందే ఆమె అట్లా ఎదిగిపోవడం చూసి వూర్లో చానామంది తట్టుకోలేక పోయినారు. "ఆదోనిలో వాని దగ్గరా వీని దగ్గరా పండుకొని సంపాదిస్తున్నట్టుందిది' అంటూ వెనుకనుంచి నానాక మాటలు. కొందరు కోటయ్యకు గూడా ఎక్కియ్యడానికి చూసినారు గానీ కోటయ్య వాళ్ళను మళ్ళీ దగ్గరికి గూడా రానియ్యలేదు. చూస్తుండగానే పాతయింటిని పడగొట్టి కొత్తమిద్దె కట్టించినారు. ఒకరోజు కోటయ్య ఆమెతో "సూడు... మనం ఎన్నాళ్ళు కలిసున్నా పెండ్లాం పెండ్లామే.. వుంచుకున్నది వుంచుకున్నదే... నీకిష్టమైతే సెప్పు పెండ్లి చేసుకుంటా అన్నాడు. ఆ మాటల్తో ఆమె వణికిపోయింది. ఇంతవరకు ఎక్కడా ఎవరూ ఇట్లా సేయలేదు.

"కానీ... ఆచారం" అంది వణుకుతున్న గొంతుతో... బసివినిగా మార్చినప్పుడు మెళ్ళో పెద్దబసివిని కట్టిన తాళిని చూసుకుంటూ...

''సూడు ఆచాలకేముంది గానీ... ఆచరిస్తే నెత్తికెక్కుతాయి... ఎదురుతిరిగితే పారిపోతాయి. ఇప్పుడు ఏ ఇంట్లోనన్నా ఆడపిల్లలను వదుల్తున్నారా... లేదు గదా... ఎవరో కొంతమంది బసివినులు తమ ఆడపిల్లలకు పెండ్లి సేయలేక, ఇంకో దారిలేక రహస్యంగా కర్నాటకకు తీసుకొని పోయి అక్కడక్కడ బసివినులుగా మారుస్తున్నారే గానీ... దాదాపు అంతమై పోయినట్లే... పోయినేడు టౌనులో సదువుకొన్న గౌరమ్మ కొడుకు వాళ్ళమ్మకు కట్టినవన్నీ తెంపి, ఇసిరి ఈథిలో పడేశ. ఎవరన్నా నోరెత్తిరా... ఎవనికన్నా అంతగా బాధుంటే ఆళ్ళింట్లో ఆడపిల్లలను దింపుకోమను. నా మాటిను. నా తర్వాత నీకు ఏ హక్కు వుండదు. నీవూ, నీ బిడ్డా అన్యాయమై పోతారు" అంటూ నచ్చచెప్పినాడు. తర్వాత ఆదోనిలో పొదుపు సంఘం పెద్దలముందే ఆమెను పెండ్లి సేసుకున్నాడు.

"ఇదేదో ఆనికి మందు పెట్టినట్లుంది. అందుకే అది ఆడమన్నట్టళ్లా ఆడుతున్నాడు" అంటూ వూర్లో శానామంది నోళ్ళు నొక్కుకున్నారు. కానీ అనుకోకుండా అది జరిగిన సమ్మచ్చరానికే కోటయ్య తెల్లకామెర్ల బారిన పన్నాడు. అది కనుక్కొనే సరికే బాగా ముదిరి పోయింది. దాంతో ఎంత ఖర్చు పెట్టినా, ఎన్ని మందులు తినిపించినా కోలుకోలేదు. చనిపోయే ముందు ఉలిగమ్మతో "సూడు... ఈ వూర్నాకొడుకులు శానామంది నిన్ను సూసి కుళ్ళుకుంటా వున్నారు. నువ్వు ఈ వూరొదిలి ఆదోనికిగానీ, కర్నూలుకుగానీ పో... ఆడ ఎవరూ ఎవరినీ పట్టించుకోరు. ఇంటినీ, భూమినీ మాత్రం ఎవరికీ అమ్మొద్దు. నీకెవరూ కూడు బెట్టినా, బెట్టకపోయినా చివరికి అవే ఆదుకుంటాయి. జాగ్రత్త" అని చెప్పినాడు. కోటయ్య చనిపోయినా ఉలిగమ్మ ఆ ఇంటినీ, ఊరినీ, జ్ఞాపకాలనీ వదలలేక అక్కన్నే వుండిపోయింది.

కోటయ్య భూమి వుండేది పెదరెడ్డి పొలం పక్కనే. రెడ్డి అవతలున్న ఇరవై ఎకరాలు కొనేసినాడు. మధ్యలో వుంది కోటయ్య పొలం. దాంతో ఉలిగమ్మను పిలిపించినాడు. ఆమె రెడ్డితో "రెడ్డీ... వానికిందా వీనికిందా నలుగుతూ చస్తా బతకాల్సిన నా జీవితాన్ని మొత్తం మార్చేసి వూర్లో మర్యాద ఇచ్చినాడు. ఆని జ్ఞాపకంగా మిగిలిన భూమది. అదీగాక ఎవరికీ అమ్మొద్దని చచ్చేముందు మాట తీసుకున్నాడు. నాకు ఎంత దుడ్లు ఇచ్చినా వొద్దు రెడ్డీ" అంది.

రెడ్డి ఎంత చెప్పినా విన్లేదు. ఎక్కువ డబ్బు ఇస్తానని ఆశపెట్టినా పట్టిచ్చుకోలేదు. చివరికి "సూడు నన్ను గాదని ఈ వూళ్ళో బదకడం అంత సులభం గాదు. గుర్తుపెట్టుకో" అన్నాడు భయపడిస్తూ. ఉలిగమ్మ ఏమాత్రం వెనక్కు తగ్గకుండా "సూడు రెడ్డీ ... నువ్వు వురిమురిమి సూస్తే వుచ్చ పోసుకోవడానికి అప్పటి ఉలిగమ్మను కాదు. నాకూ తెలుసు సట్టాలు, అధికారులు" అంటూ బైటకొచ్చేసింది. రెడ్డి అవమానంతో రగిలిపోయినాడు. ఎట్లా దెబ్బ కొట్టాల్నా అని ఎదురు

చూడసాగినాడు. అంతలో ఒకరోజు ఉలిగమ్మను మొట్టమొదట వుంచుకున్న పరమేశ్వర రెడ్డికి అర్ధరాత్రి గుండెనొప్పొచ్చి ఆసుపత్రికి తీసుకొని పోయేలోపల చచ్చిపోయినాడు.

* * * * * *

"రేయ్ దించండ్రా దాన్ని" అంటూ ఎవరో గట్టిగా అరిచినారు. ఒకడు ఆమె చేయి పట్టుకొని బండి మీద నుంచి కిందకు ఈడ్సడంతో ఉలిగమ్మ వులిక్కిపడింది. చేను చుట్టూ జనాలు పదవే అంటూ దొబ్బుకుంటూ చేనులోనికి తీసుకుపోయినారు. చేను మధ్యలో ఎర్రని మూట. "తియ్... పైకి" గట్టిగా అరిచినాడు మంత్రగాడు. ఉలిగమ్మ దాన్నే సూస్తూ "ఇదేందో నాకు తెలీదు" అనింది. "ముయ్ నోరు... ఇంగా ఎందుకీ నాటకాలు... అంతా బైట పన్నాక. తీస్తావా నాలుగు తన్నమంటావా" అన్నాడు పెదరెడ్డి అనుచరుడు చేతిలోని చనకాల పైకి లేపుతూ. ఉలిగమ్మ వణుకుతా మూట తీసి ఇప్పింది. లోపల ఒక టెంకాయ, పసుపూ కుంకుమ, ఏవేవో వెంద్రుకలు, రెండు బొమ్మలు. ఒకదానిపైన పరమేశ్వరరెడ్డి పేరు, మరొకదానిపైన పెదరెడ్డి పేరు. బొమ్మల కడుపులో గుచ్చిన పెద్ద ముల్లులు.

అవి చూసేసరికి అందరూ అదిరిపన్నారు. విషయం వూరంతా గుప్పుమనింది. "ఉక్కు లెక్కుండె పరమేశ్వరరెడ్డి. అట్లాంటోడు రాత్రికి రాత్రి సచ్చిపోతే అప్పుడే అనుకుంటి... దీని వెనుక ఏదో మాయో మంత్రమో వుంటుందని" అన్నాడొకడు.

"కోటయ్యకు గూడా ఇదే మందుపెట్టి సంపిచ్చింటాది. లేకుంటే ఎవడన్నా వూరికిడ్సిన ముండను పెండ్లి సేసుకుంటాడా... ఆదోనిలో పెద్ద పెద్దోళ్ళను మరిగింది గదా... తెలిస్తే మొగుడు అడ్డమొస్తాడని అన్నీ రాపిచ్చుకొని సంపిచ్చిందిది" అన్నాడింకొకడు.

"పెదరెడ్డి పొలం మీద గూడా కన్నేసిందిది. రెడ్డి సస్తే వాళ్ళ పిల్లలు ఎవరూ ఈ దేశంలో లేరు గదా... దాంతో తక్కువకి

కొనుక్కొని తన చేనులో కలిపేసుకోవచ్చని ఉపాయం పన్నింది."

వూర్లో ఎవడెవడు ఎంతవరకు ఆలోచించగలడో అంతవరకూ ఊహలు అల్లుతూ పక్కనోళ్ళకు చెప్పసాగినారు. రకరకాల కథలు, రంకులు చిలవలు పలవలుగా వూరంతా వ్యాపించసాగినాయి. అంతకుముందు వూర్లో చచ్చిపోయిన వాళ్ళవి గూడా ఉలిగమ్మకే అంటగట్టసాగినారు కొందరు .

తరువాత రోజుకు పంచాయితీ వూరిమధ్యకు చేరింది. వూర్లో పెదరెడ్లు, బోయోళ్ళు, బలిజోళ్ళు, పింజరోళ్ళు అందరూ కట్టమీదకు చేరుకున్నారు. మాలమాదిగలు కింద కూచున్నారు. రెడ్డి అందరి వంకా చూసి.

"సరే ... ఐపోయిందేదో అయిపోయింది. ఆడకూతురు ఇప్పటికే చెయ్యాల్సిన శాస్తి చేసినాం. ఇంగ వదిలేద్దాం" అన్నాడు కొంచెం జాలిగా మొగం పెట్టి.

ఆ మాటలకు బోయరంగన్న "ఏంది రెడ్డీ అట్లంటావు. రక్తం రుచి మరిగిన పులి వూకెనే వుంటాదా... ఇప్పటికే శానా మందిని పొట్టన పెట్టుకుంది. ఇట్లాంటోళ్ళు వూర్లో వుంటే ఇంట్లో పాముని పెట్టుకొని సంసారం సేసినట్లే. దీన్ని వూర్నుంచి తరిమేస్తేగానీ వూరికి పట్టిన దరిద్రం వదలదు" అన్నాడు ఆవేశంగా.

చాలామంది జనాలు, పెద్దలు రంగన్న మాటకు మద్దతు పలికినారు.

"అదిగాదు దొరా... అట్లా ఒక్కసారిగా పొమ్మంటే ఎట్లా. ఇండ్లూ, భూములూ అన్నీ వదులుకోని. ఇంగోపారి ఆలోచించండి" అన్నాడు ఒక మాదిగాయన కొంచెం జాలిగా.

"ఏంరా మీ కులమోళ్ళని వెనకేసుకొస్తున్నావా... వూరు ముఖ్యమా... కులం ముఖ్యమా... ఇట్లాంటోళ్ళ పట్ల కనికరం సూపిస్తే మన తలకొరివి మనం పెట్టుకొన్నట్లే... వచ్చిన కాడికి మనమే అమ్మిచ్చి

వూరిడిపియ్యడమే మేలు” అన్నాడు మరో కులపెద్ద.

దాంతో అందరూ కలిసి ఆలోచించి పదిరోజుల్లో అన్నీ అమ్ముకొని వూరిడ్సాలని, కాదు కూడదని ఈన్నే వుంటే ఎవరూ మాట్లాడగూడదనీ, ఎవరింటికీ పిలవగూడదనీ, వూర్లో ఏ వస్తువులూ ఆమెకు అమ్మగూడదనీ, విషయం ఊరు దాటగూడదనీ తీర్మానం చేసినారు.

రెడ్డి పెదాలపై వంకరగా చిరునవ్వు మొలిచింది.

ఉలిగమ్మ మాటల్ని ఎవరూ పట్టిచ్చుకోడం లేదు. వినడం లేదు. ఏమీ చేయలేక నిస్సహాయంగా చూస్తా వుంది.

అంతలో ఏదో చప్పుడు.

కొందరు తలల్తిప్పి అటు చూడడంతో అందరి చూపులూ అటువైపుకే తిరిగినాయి.

విషయం వూరు దాటి బైటకెట్లా వెళ్ళిందో ఎవరికీ అర్థం కాలేదు. ఒక్కసారిగా అక్కడ మాటలు ఆగిపోయినాయి.

ఆ నిశబ్దానికి ఉలిగమ్మ తలెత్తి అందరూ చూస్తున్నవైపుకి చూపు పారించింది.

దూరంగా బస్సు దిగి బెరబెరా వస్తున్న కొడుకు, వాని వెనుక టౌను నుంచి వస్తున్న కొందరు విలేఖర్లు, మాదిగ నాయకులు కనిపించినారు.

అంతవరకూ చిరునవ్వుతో వున్న రెడ్డిమొగం ఒక్కసారిగా వాడిపోయింది. కళ్ళలో ఏదో భయం, తత్తరపాటు కదలాడింది.

దాన్ని చూసిన ఉలిగమ్మ కందిన పెదాలపై సన్నని చిరునవ్వు తళుక్కున మెరిసింది.

*     *     *     *     *          *

